Regd No. H. 45
M. 3813

గోలకొండ
కవులసంచిక
చందాదారులకు
౧ రూపాయి
మేనేజరు.
గోలకొండ పత్రిక
త్రూపుబజారు,
హైద్రాబాదు-దక్కన్.

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

హైద్రాబాద
వివరములకు
నిజాంరాష్ట్ర
పరిపాలనము
వెల ౬ అణాలు
గోలకొండ బుక్ డిపో
త్రూపుబజారు,
హైద్రాబాదు.

సంపుటము ౧౨ హైద్రాబాదు-దక్కన్ శా.శ.౧౮౬౦ బహుధాన్య నామసంవత్సర చైత్ర శు॥ ౧౨ (౭ ఖుర్దాద్ ౧౩౪౭ఫ.) సోమవారము సంచిక ౬౪

# నగరమందలి మత కలహముల వివరములు

## నగరమునందు కర్ఫ్యూ ఆర్డరు, ౧౪౪ సెక్షన్ ప్రయోగించుట

## అనేక వీధులలో శాంతి సంరక్షణ ప్రయత్నములవలన పరిస్థితులు అనుకూలించుట

దుండగీయులు నగర ప్రాచీనభాగముల రంగస్థలముగా చేయుట

ప్రభుత్వమువారి విమర్శనానంతర విషయములు

నాంపల్లి అల్లరులు

(గోలకొండ విలేఖరి)

హైదరాబాదు ఏప్రిలు ౮

మంగల్ హాటు ప్రాంతమందలి అల్లరులు నాంపల్లికిమాద్దివ్యాపించునేమోయను భయము నాంపల్లిప్రాంత జనులలో ౬ ఏప్రిలు బుధవారము నాటికే కొద్దిగా అంకురించెను. అనాటిసాయంకాలము నాంపల్లిలో రైలుస్టేషనుకు సమీపమున అంజనేయస్వామి దేవాలయమునందు శ్రీరామభక్తసమాజమువారి పక్షమున జరుపబడుచుండిన ఉత్సవముల సందర్భములో కార్యక్రమము పూర్తిగాకముందే కొంచెముచీకటి పడ నారంభించగానే స్త్రీలందరు భయముచే యిండ్లుచేరుకొనిరి. అనాటిరాత్రి హరికథా కార్యక్రమము మానుకొనబడెను.

మరునాడు సాయంకాలము మంగల్ హాటు ధూల్పేటప్రాంతములందలి అల్లరిలో చనిపోయిన ఒకముసల్మానునిశవము ఊరేగింపుతో ఔ కొన్ని వేలమంది జనులు వెంటపోవుదురని అనుకొనుచు, నాంపల్లిప్రాంతనివాసులు అ ఊరేగింపు ముగిసినతర్వాత గుంపు ఎటువైపుకు పోయేమోనని భయపడుచు, ఒకరికొకరు జాగ్రతచెప్పుకొని, యిండ్లతలుపులు గట్టిగా బిగించుకొని భయపడుచు కాలము గడిపిరి. నాంపల్లి అంజనేయదేవాలయమందలి అనాటి సాయంకాలపు కార్యక్రమముకూడ మానుకొనబడెను.

... ... ...

హైదరాబాద ౮ ఏప్రిలు

నిన్నఉదయము నాంపల్లి అంజనేయస్వామి దేవాలయములో జరుగవలసియుండిన ఉత్సవ కార్యక్రమమును యథావిధిగా గాకపోయినను ఒకవిధముగా నైనను జరుపుటకు అనుకొనియుండిరి. కాని ౮ — ౧౦ గంటల వేళకు కార్యక్రమము సరిగా నెరవేరదనియు జనులెవ్వరును రాజాలరనియు అనుకొని కార్యక్రమమును పద్ధతిప్రకారము జరుపుయత్నము మానుకొనిరి.

... ... ...

రాళ్లు రువ్వుట

గురువారము ౭ ఏప్రిలు నాటిరాత్రి నాంపల్లిలో నగరాభివృద్ధిశాఖవారు కట్టించియున్న కొన్నియిండ్లపై రాళ్లురువ్వబడెను. గాని ఎవరికిని దెబ్బలు తగులలేదు.

... ... ...

పోలీసుభటుల ప్రత్యక్షము

బుధవారమునుండి నాంపల్లినివాసులు కొందరు అక్కడి పోలీసుఅధికారులతో తమ ప్రాంతమందు దుండగులు తిరుగుచు బెదరింపుచున్నారనియు, తమకు భయముగా నున్నదనియు, తగిన సంరక్షణ కావలయుననికోరిరి.

... ... ...

తర్వాత నేపిహాసి అంజనేయుల గుడి ప్రాంతములలో అదనముగా పోలీసులు రప్పించబడి కాపలా యుంచబడిరి.

... ... ...

శుక్రవారము నాటిరాత్రి పోలీసులు కొన్ని వీథులతిరిగి జనుల ప్రాణధనములకేమి భయములేనట్లు కాపాడగలమనియు, 'ఎవరును రాత్రి ౭ గంటల తర్వాత వీథులలో తిరుగరాదనియు, తిరిగినచో, తుపాకిదెబ్బలకు గురికావచ్చుననియు, ప్రకటించిరి. అందుమీద అక్కడి వారలకు కొంతభయము తీరెను. కొందరుమాత్రము భయపడుచునే రాత్రి సరిగా నిద్రలేక గడపిరి.

... ... ...

హైదరాబాదు ఏప్రిలు ౮

మిలిటరీసేవకుల సంచారము అధికమయ్యెను.

నిన్నరాత్రి నాంపల్లిలో అల్లరి ఏమియు జరుగలేదు. నేడుదయమునుండి నాంపల్లి నివాసులు కొంత తలఎత్తుకొని తిరుగసాగిరి.

నిన్న సాయంకాలము ఇక్కడి సర్కారి వైద్యశాలకు చేతులు చితకగొట్టబడి వచ్చియుండినవాడు చనిపోయెను. నేడుదయము పోలీసువారలు వచ్చి పంచునామా చేసికొనిపోయిరి.

ఆఫీసులకు పోవలసిన ఉద్యోగులు ఎట్లుండునో ఏమోఅను అనుమానముచే పోకుండ ఇండ్లవద్దనే ఆగిపోయిరి. మధ్యాహ్నమునుండి పోలీసు అధికారులు అక్కడి నివాసులతో శాంతిసంఘములను ఏర్పాటుచేయుటకు ప్రయత్నించుచుండిరి. ఇక్కడ హిందువులును ముసల్మానులును ఇంతవరకు వైషమ్యములు లేకుండ నున్నాము, ఇకమీదకూడ అట్లే యుండగలము, కొత్తవారలను ఎవరినిగాని రానీయము అని వ్రాసియుండిన ఒక పత్రముపై అనేకులు ప్రభుత్వోద్యోగులయొక్కయు తదితరుల యొక్కయు సంతకములు గైకొనబడెను. నాంపల్లి హైసాహెబునకు అధికారులే సెలవిచ్చినట్లు తెలిసినది.

హైదరాబాదు (దక్కన్)౧౦ ఏప్రిలు

నాంపల్లిలో నేడు ఉదయము ధైర్యము చేకూరినది. జనులు మామూలుపనులలో తిరుగుచున్నారు. నాంపల్లి బజారు వీధికొనక సాయుధులగు సైనికభటులు క్యాంపుచేసికొని యున్నారు.

ఇండ్లు కాళీయగుట

గత శుక్రవారము నాటికే మల్లేపల్లి నివాసులు పలువురు నాంపల్లికివచ్చి అక్కడ తమ బంధుమిత్రుల యిండ్లలో చేరుకొనియుండిరి. నాంపల్లిలోనే ౧౦-౧౨ ఇండ్లవారలు ఇండ్లు తాళములు వేసికొని పోయియుండిరి. కొన్ని దుకాణములు నేడును మూయబడియున్నవి.

హైద్రాబాద, ఏప్రిల్ ౮

(శుక్రవారం)

నేపల్లీరోడులో కొంత అల్లరి జరిగినది. కొందరు గాయపడిరి.

... ... ...

ఎక్కువ ఉపద్రవముండు ప్రదేశములలో అనగా గౌలిగూడెము, మహారాజుగంజు మొదలగు వీథులలో మిలిటరీసైనికులు నియమింపబడిరి. నగరమునందంతట వీరు మోటారు లారీలలో తిరుగుచున్నారు.

... ... ...

అసమయముననే క్రొత్తవారధి దర్వాజవద్ద సుకరహోటలు సమీపమును, నెలెక్టుటాకీసు వద్ద అల్లరులు జరిగెను. కొందరు గాయపడిరి.

... ... ...

ఇసామియా బజారు, ఏప్రిల్ ౮

(శనివారం)

సమయము గడచినకొలదియు వైషమ్యభావములు పెంపొందుచుండుటచే రాజా మేఘరాజా గారును, మౌల్వీ మహమ్మదు మెహదీహసన్ సా॥ శాంతిని స్థాపించుటకై కృషిసలిపిరి, తత్ఫలితముగా శుక్రవారమునాటినుండి యెట్టి కలతలును కలుగలేదు.

రక్షకశాఖామాత్యులగు అర్.ఎం. క్రొస్టర్ గారు ఈ ప్రయత్నములను స్వయముగా వచ్చి చూచి స్థానికులను ప్రశంసించిరి.

శాంతి సంస్థాపకులగు పై ప్రముఖులు తమ ప్రయత్నములు ఫలించినందులకు సంతసమును ప్రకటించుచు మిఠాయిని పంచిపెట్టిరి. స్థానిక ప్రజలు వీరికృషిని ప్రశంసించుచు పై ప్రముఖులిద్దరికిని పుష్ప . రములను వేసిరి.

... ... ...

హైద్రాబాద, ఏప్రిల్ ౮

(శనివారం)

సాయంకాలము సుమారు ౬ గంటల సమయమున నగరాంతర్భాగమున జరిగిన అల్లరిలో యిద్దరు హిందువులు గాయపడిరి. వారిని అస్పత్రియందు చేర్చిరి,

గౌలిగూడెంనందు రామమందిరమునందు సేవ శాంతముగా తీయబడినది. పోలీసు కాపలా సక్రమముగా నుండుటచే భజనయుక్తముగా సేవ యుత్సవము జరిగినది.

రాత్రి సుమారు ౧౦గంటలనుండి సిక్కువారల పతాకము యూరేగింపులో మిలిటరివారి కాపలాతో శాంతముగా జరిగినది.

మార్కెటువద్ద ఉదయము ౧౧ గంటలకు పెద్ద అల్లరి జరిగినది. అనేకులు గాయపడిరి.

... ... ...

అనేక వీధులలో కొన్ని కొట్లులు మాత్రము తీసియుండెను. అల్లరులు జరుగునని నిరాధారములవదంతులు నగరమునందంతట ప్రబలియుండెను! కాని యెట్టి దుండగములు జరుగలేదు. మిలిటరి పరేడు మాత్రము యథావిధిగా నగరమునందు జరుగుచుండెను.

... ... ...

ఉదయము ౧౦ గంటల సమయమున మహారాజాగంజయందు పెద్దఅల్లరి జరిగినది. అనేకులు గాయపడిరి.

... ... ...

(గోలకొండ విలేఖరి)

కాచీగూడెం: ఏప్రిల్ ౧౦

(అదివారం)

కాచీగూడెము, ఈసామియా బజారు, పరిసర ప్రాంతములు నగరములోని ఇతర ప్రాంతములందు వ్యాపించియున్న కలహ వాతావరణమునుండి దూరముగా నుండజాలకపోయినను, ఎక్కువ సంఘర్షణలును జరుగలేదు. నేస్తవారము నాటిరాత్రి వార్తలనుబట్టి ఈ ప్రాంతము అందుగూడా విషమపరిస్థితు లేర్పడునని ఇరుపక్షీయులును భీతావహులై యుండిరి. వీథులందు అనాటిరాత్రి సుమారు ౩ గంటల

... ... ...

(గోలకొండ విలేఖరి)

హైద్రాబాద, ఏప్రిల్ ౮

(శుక్రవారము)

ఉదయము నుండియే నగరమునందంతట కోలాహలము ప్రారంభమగు సూచనలు గోచరించుచుండెను. ప్రభుత్వ కార్యాలయములకు, పాఠశాలలకు సెలవుదినములోబాటు శ్రీ రామనవమి పండుగదినస మేర్పడియుండుటచే దుండగీయులకు పట్టపగములు లేకుండునటుల కర్రలతో, కత్తులతో కేకలిడుచు సందుగొందులలో, రోడ్లపై నడచుచుండుటచే భయంకరముగానుండెను. మంగల్ హాటునందు గురువారం చనిపోయిన యిద్దరు పఠానుల శవములు నగరమందలి చంచలగూడెమునకు గొనిపోబడి అచ్చటినుండి సుమారు ౨౦ వేల మహమ్మదీయుల యూరేగింపుతో శవములు కాచీగూడెము వైపు తీసుకపోబడుచుండ పోలీసువారు రద్దగించుటచే అశవములు చంద్రఘాటువద్ద గల రుద్రభూమియందు పూడ్చిపెట్టబడినవి.

... ... ...

యాకత్పురం అల్లరి

హైద్రాబాద, ఏప్రిల్ ౧౦

(గోలకొండ విలేఖరి)

నిన్న మధ్యాహ్నము యాకత్పురం బ్రాహ్మణవీధిలో కొందరు హిందువులు, తురకలు వీధియందు అల్లరులు జరుగకుండుట కొడంబడిక చేసుకొనిరి. కాని దుండగీయులుకొందరు అల్లరులు జరుపుటచే కొందరికి గాయములు తగిలినవి కొన్ని దుకాణములు లూటీచేయబడినవి. వెంటనే పోలీసువారు సద్దుబాటుగావించిరి.

అరెస్టులు

కర్ఫ్యూ ఆర్డరుకు వ్యతిరేకముగా ప్రవర్తించినందున నిన్న ౧౫ మంది అరెస్టుచేయబడిరి.

శిక్షలు

ఇదివరకు అరెస్టుచేయబడిన ౧౨ మందికి సిటి మేజస్ట్రేటుగారు ప్రతివారికి రు ౨౦ల జుర్మానా, చెల్లించనిపక్షమున వారంరోజుల సామాన్యశిక్ష విధింపబడినటులను, తురకవాండ్లను ముట్టడించి గాయపరచిన కరంచంద్, బందుసింగు, కిషన్‌సింగు, చంద్రసింగు అను సిక్కులను రిమాండుజేలు చేసినటులను, అరెస్టుచేయబడినవారలలో నొక అర్యసమాజమని వద్ద కేలులో పరీక్షించగా ౯. చాకులు, త్రాడుకట్ట, ౪ సీటీలు లభించినటుల దక్కన్ న్యూసువారు తెలుపుచున్నారు.

శవ యాత్రీకుల కాదేశము

హైద్రాబాద ఏప్రిల్ ౮

ఈ సంఘర్షణమునందు మరణించిన యిద్దరు పఠానుల శవములు పూడ్చుటకు పూర్వము జరిగిన సమూహమందు నవాబు బహద్దురుయార్జంగు బహద్దురుగారు శవయాత్రయందున్న ౨౦ వేల మహమ్మదీయుల నిటుల సంబోధించిరి: —

"ప్రభుత్వము మనది. రాజ్యము మనది. ప్రభువుమనవారు. వారి గౌరవమును సంరక్షించుట మన కర్తవ్యము. సహమ్మదీయులారా మీరు మీ యుత్సాహశౌర్యముల నణచి యుంచకున్న యీ జయుధములు నిష్ఫలములు. మీరందరీ శవయాత్రయందు శాంతియుతముగ ప్రజలనెల్ల శోక సముద్రమునందు మునిగియుండునటుల గోచరింపజేయవలయును" ని నవాబుగారు నుడివినటుల దక్కన్ న్యూస్ వారు తెలుపుచున్నారు.

## ప్రభుత్వము

ప్రకటన. ౧

మంగల్ హాటు, ధూల్పేట

మధ్యాహ్నము ౩ గంటలనుండి ప్రదేశములందు అనేకగల్లీలలో అక్కడక్కడ విడివిడిగా ఒకరినొకరు కొట్టుకొన సాగిరి. కొన్ని సందర్భములలో చిన్న చిన్న దుకాణములలో వస్తువులు అవల త్రోయబడసాగెను. ఇట్టి చీటు మాటు కొట్లాటల వలన, ఇంతవరకు సంగతులనుబట్టిచూడ ౨౭ మందికి గాయములు తగినట్లు తెలిసినది. వారలలో ౨౫ మందికి చిన్నగాయములకై చికిత్సచేసి పంపిరి. ఒక హిందువు, ఒక ముసల్మానుడు ఇరువురికి మాత్రము కొంచెము గొప్పదెబ్బలు తగిలినట్లు కనబడెను, వారలు అస్పత్రిలో నున్నారు ఇది పూర్తి సమాచారముకాదు. గలాట్యా ప్రాంతములో అసఫియా పీనల్ కోడు (తాజీరాత్) లోని దఫా ౧౪౫ అమలు పరచబడెను. నగర మేజస్ట్రేటు నగర రక్షక శాఖాధికారితో కలిసి అచట నుండెను. ౨౧ మంది అరెస్టుచేయబడిరి. ౨ రల కీరోజు ఉదయము శిక్షచేయబడెను, ఇరుపక్షములవారల నాయకులను శాంతిని మంచి సంబంధములను పునఃస్థాపించుటకై అధికారులకు తోడ్పడుటకు కోరడివారు. ఈ లోగా పరిస్థితి చేరికె లొంగియున్నది. ప్రజలు ఎట్టి భీతిజనకమునైన వదంతులనుగాని నమ్మకూడదని హెచ్చరించబడుచున్నారు.

## ౨౫ వేల మంది ఊరేగింపు ఎట్టి అల్లరిలేక ముగియుట

ప్రకటన. ౨

హైద్రాబాదు(దక్కన్) ౭ ఏప్రిలు. రాత్రి ౧౧ గం.

నగరములో మత సంబంధమునైన అల్లరుల సందర్భములో దీనికి పూర్వపు కమ్యూనిక్కు ఇచ్చినప్పటికంటె చాలా బాగుపడినది, చచ్చిన ఇరువురు ముసల్మానుల శవములను ఊరేగింపుసమయముకూడ పోవుజనులు ఆశవమును పూడ్చిపెట్టినతర్వాత అల్లరి జరిగినచోటికిపోదలచియున్నారను భయము కలిగించు వదంతులు వ్యాపింపజేయబడెను. కాని క్రమక్రమముగా అ ఊరేగింపులోని జనుల సంఖ్య ౨౫ వేల మంది యున్నను, వారలలో అనేకుల చేతులలో అయుధములున్నను, ఎంతో కట్టుబాటుతో నుండి సమాధికి పోవునపుడును, సమాధినుండి వచ్చునపుడు సంపూర్ణమైన కట్టుబాటుతో వర్తించిరి, తర్వాత ఎవరినిగాని కొట్టుటగాని. రాళ్లురువ్వుటగాని జరిగియుండలేదు. నేడునగరములో సంపూర్ణముగ శాంతిగలదు. ప్రభుత్వసభాధ్యక్షులవారును.పోలీసుశాఖమంత్రియుఅల్లరులు జరిగిన ప్రదేశములలో కొత్వాలు గారితో కలిసి ఈరాత్రి ౧౦ గం. ౮. వేళ తిరిగిచూచిరి.

## ప్రభువుగారి పరితాపము

హైద్రాబాద, ఏప్రిల్ ౧౦

"ప్రస్తుతము దేశముయొక్క పరిస్థితు లావలి ప్రభావములవలన దుష్టములైనందులకు చింతిల్లుచున్నాము. దీనివలన ఉభయపక్షముల (హిందువులు ముస్లింలు) వారియందేర్పడిన సంఘర్షణముతో గాయపడిన వ్యక్తులగురించి విచారము, ప్రాణముల గోల్పోయినవారి కుటుంబీకులతో సానుభూతికలదు. ఇంతేగాక యీ సందర్భములో శాంతి, సౌఖ్యములేని రాజ్య మభివృద్ధి పథ మవలంబించజాలదని విశదపరచుకుండజాలను. ఇట్టి "ఖూటకపు కృత్యముల" వలన రెండుపక్షమువారికి లాభముకలుగుటకు మారు ధన ప్రాణనష్టములు సంభవించును; ఉభయ పక్షములలో వైషమ్యము లేర్పడుటచే శాంతి స్నేహభావములు కలుగుటకుమారు వైరుద్ధ్య శత్రుభావములు కలిగితీరును. కావున ఉభయులు విచక్షణజ్ఞాన ముపయోగించి లాభప్రదమగు పథమవలంబించవలయు"నని ప్రభువుగారు ఫర్మానుద్వారా విశదపరచిరి.

"మొత్తముపై నా పఠహాప్రకార ముభయులు ప్రవర్తించెదరని నాకుసంపూర్ణ విశ్వాసము గలదు. ఇట్టి అక్రమమార్గమే యవలంబింపబడుచున్న యెడ ప్రజాశాంతికి, దేశ అపఖ్యాతికి కారణమగుటంజేసి గత్యంతరములేక నాప్రభుత్వము కఠినపద్ధతు నవలంబించి యీ పద్ధతిని లాపివేయుబడును, ఒక వర్గమువారికి నష్టము లాభమూ యనునది గమనార్హము కాజాలదు. ప్రజాశాంతిని అపాయమునుండి కాపాడుట, ప్రభుత్వాధీనమందలి వివిధ వర్గములవారి ధనమాన ప్రాణముల సంరక్షించుట ప్రతివారక ప్రభుత్వ కర్తవ్యమని జ్ఞాపకముంచవలయును. ఇది ప్రాచీనకాలమునుండి అసఫియా వంశీయుల ప్రత్యేకత్వము. ఇంతే."యని ము.ను.క. నిజాం ప్రభువుగారు ప్రజల హెచ్చరించిరి.

ప్రజా పరిజ్ఞానార్థ మీ విషయము గెరుమామూలి జరిదాయందు ప్రకటించవలయును.

(సం) ప్రభువుగారు

## సికింద్రాబాదులో అపోహలు

(గోలకొండ విలేఖరి)

సికింద్రాబాదు; ఏప్రిల్ ౧౦.

హైద్రాబాదునగరంలో హిందూ-మహమ్మదీయసంఘర్షణచేయానగరములో ప్రజలు చాలా భయపడుచున్నారు.. ౭ ఏప్రిల్ ౧౯౩౮వారు దుండగీయులు కొందరు వ్యాపారస్థులను బెదరించుటచే ౯ గురు మహమ్మదీయులును, ౪ గురు హిందువులను సిటీ పోలీసువారు టవున్ పోలీసు ౩౪ (౬) సెక్షన్ క్రింద అరెస్టు చేసిరి. ఇందు ౮ మహమ్మదీయులను, ౩ హిందువులను హామీపై వదలిరి.

తిరిగి ౮ ఏప్రిల్ ౧౯౩౮వారు యిటీకారణముచే ౧ హిందువు ౧ మహమ్మదీయుడు అరెస్టు చేయబడిరి. వీరందరికి సికింద్రాబాదు కంటను మేజిస్ట్రేటుయగు మిస్టర్ హెచ్. ఎన్. స్మిత్ గారు ఒక్కొక్కరికి వారము దినముల కఠిన శిక్ష విధించిరి.

ప్రస్తుతము దుకాణములు మామూలు వేళకంటె అలస్యముగ తెలచి, తొందరగా మూయుచున్నారు. వీథులలో ప్రత్యేక పోలీసు భటులు వ్యాపారస్థులకు ధైర్యమిచ్చుచు దుకాణములను తెరపించుచున్నారు.

# ZANDU
## Pharmacuetical
Works Ltd., P. O. Box 5513, Bombay

ఆరోగ్య బలములకు

స్త్రీలు

**జాండువారి**

అశోకారిష్టను వాడదగును.

అధికసుమరోగములను
స్త్రీలఇతరరోగములకును
నమ్మకముగకుదుర్చును.

నూతనజీవనోత్సాహములకు

**జాండువారి**

కేసరీజీవన్ వాడుడు.

శరీరమున కంతటికివిశ్రాంత్తకళనిచ్చు
రుచ్యమైన పుష్టికరాహారము.

ఇది చాలవిలువగల వస్తువులతో తయారుచేయబడినది. గుణమునేగాక మంచి రుచియును, సువాసనయు గలిగి పలువురచే యోగ్యతాపత్రికలను బొందియున్నది. ½ తులము మొదలు 1 తులమువరకు దినమునకు 2పూటలు పాలతో సేవించిన మంచి వీర్యపుష్టిని, బలమును, ఉత్సాహమును, కలిగించును వ్యాధిగ్రస్తులై శరీరము కృశించియున్న వారికి వెంటనే రక్తమువృద్ధిచేసి మంచి దేహకాంతిని కలిగించును. క్షయవ్యాధికి చాల ముఖ్యమైనది. వృద్ధుల బలహీనతకు బాగుగా పనిచేయును.

జాండు ఫార్మస్యూటికల్ వర్క్స్, లిమిటెడ్, బొంబాయి ౪

నిజాంరాష్ట్రమునకు సోల్ ఏజంట్లు:—

డి. జె. పారెఖ్ అండుకో,

జుమ్మామసీదువద్ద, సికింద్రాబాదు (దక్కన్)

బి. వి. ఆర్. రెడ్డిసిగార్

కంపెనీ; కమ్మంమెట్టు—నైజాం
వరంగల్ జిల్లా.



శ్రీ వెంకటేశ్వర మార్కుగల, కందుకూరు పొగాకుచే తయారుచేయబడిన, చుట్టలు, మరియు పొగాకురకములు దొరకగలవు. ఒకసారివాడిన-చోవిశదము కాగలదు.

వివరములకు నేడే కార్డువ్రాయుడు.

ఛగన్ లాల్ నారాయణ్

అత్తరు వ్యాపారులు
మచ్లీకమాన్ హైద్రాబాదు

మావద్ద అన్ని విధములైన స్వదేశ అత్తరు తైలములు అగరుబత్తీలు, కుంకుమపువ్వు, చాయ డబ్బీలు, జర్దా మొదలగునవి అమ్మబడును.

చికిత్సలేని
రోగమేలేదు

క్షయ, హిస్టీరియా, మధుమేహము, శ్వాసము, పక్షవాతము, పురుషత్వహీనము మొదలగు రక్తవీర్య సంబంధ రోగములు గ్యారంటీగా కుదుర్చబడును.

ప్రొఫెసరు జి. పి. శాస్త్రి
రాజవైద్యులు.
యస్.ఏ., ఏ.వి., బి.ఆర్.,
ముర్లీధర్ బాగ్, హైద్రాబాద్.




సుప్రసిద్ధ లోకామయహర
కస్తూరి మాత్రలు

జలుబు, జ్వరము, దగ్గువగైరాలకు చాల ఉపయోగము.
సీసాంకి రు౦-౪-౦.
శ్రీసీతారాఘవ ఔషధాలయం
మైసూరు
ఏజంట్లు:—చగన్ లాలు నారాయణ్ అత్తరు వ్యాపారులు హైద్రాబాదు దక్కన్.

కలరా — భయములేదు — కలరా — భీతిజెందకుడు

కలరాకు దివ్యౌషధము

విక్టర్ డ్రాప్స్ మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును. కొంచెము మాడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును. అనేకులు మావిక్టర్ డ్రాప్స్‌ను ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్ డ్రాప్స్ ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును.

సోల్ యెజంట్లు: విక్టర్ అండు కో
పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు.

సతీమణులకు
సంతతి సౌఖ్యాలు

సతీమణులకు సంతతి సౌఖ్యాలు, యింటికంతటికీ వెలుగు వెన్నెలలు. అందువల్లనే స్త్రీల ఆరోగ్యము అంత ముఖ్యము.

స్త్రీలకు ఋతుసంబంధమైన దోషముల వల్ల శరీరం కృశిస్తుంది. సంతానవాంఛ సఫలతపొందదు.

కాని లోధ్ర సేవిస్తే స్త్రీలకు సత్సంతానము సౌఖ్యజీవనము తప్పదు.

సతీమణుల సంతతి సౌఖ్యాలకు
"లోధ్ర"

కేసరికుటీరం :: మద్రాసు

అందమైన క్షౌరమునకు

సహారా బ్లేడుల నుపయోగించుడు







పోస్టుబాక్సు 154 బొంబాయి.

గోలకొండపత్రిక

(జాతీయ అర్ధవారపత్రిక)
హైద్రాబాద

చందా వివరములు

సంవత్సరమునకు రు ౬లు
అర్ధసంవత్సరమునకు రు 3లు
విడిపత్రిక ౧ అణా

హైందవ ధర్మవీరులు

(అచ్చులో ఉన్నది)

ఇందు భారతీయవీరుల చరిత్రములు సచిత్రముగా, విపులముగా వర్ణించబడినవి.

గ్రంథకర్త:—సురవరము ప్రతాపరెడ్డి
ప్రకాశకుడు:—వి. అళ్వారుస్వామి

# Oriental
## Commercial Bank Ltd.,

Phone } 701 / 749 — Abid Road, Hyderbab, Dn. / Pathargatty " — Gram { 'Coin"

## అసాధారణఅవసరములో డబ్బు?

సామాన్య ఆదాయము దినవ్యయములకై వ్యయమగుచున్నప్పుడు అసాధారణ సమయములందు డబ్బెక్కడినుండి వచ్చును! అంటె మీసౌకర్యార్థమై నెలకొల్పబడిన **ఓరియంటల్ కమర్షియల్ బ్యాంకులో** రెండు రూపాయిలనుండి ప్రారంభించి **సేవింగ్సు బ్యాంకు** ఖాతాదారుని చేరుము. అప్పుడు నీ యిష్టానుసారము యాత్రలు, వినోదములు, స్నేహితుల కలయిక అనుభవించుచుందువు. ప్రతిరోజు ఒకపర్యాయము డబ్బుతీసికొనవచ్చును. నిలువవున్నడబ్బుపై **నూటికి నాలుగురూపాయిలువడ్డీ.**

తదితర బ్యాంకు వ్యవహారములుకూడా.

"కాయిన్" } అబిడురోడు, హైదాబాదు-దక్కన్. / పత్తర్‌ఘట్టి — టెలిఫోన్ "701" / " 749

Branch;--RAJAHMUNDRY — రాజమండ్రిలోకూడ మాబ్రాంచి కలదు

త్వరపడుడు — మంచితరుణము

చౌకరేట్లు సీజన్ సేల్సు
**1938.**

ధర భేదమున్నచో డబ్బు వాపసివ్వబడును. వలయు బట్టలు తప్పక ఖరీదుచేసి చూడుడు. మనోరంజితమైన నూతన వస్త్ర భాండాగారము.

మరిపల్లి శంకరయ్య
పెద్ద దుకాణము.

జేమ్సుస్ట్రీటు, బట్టల వర్తకము, సికిందాబాద్. (దక్కన్.)

(Portrait: MARIPALLI SHANKERIAH, 89 JAMES ST. SECANDERABAD (DN.))

D. A.

# Volo-Pep ? Petrol Saver

వెస్టరన్ ఇండియా ఓటోమోబిల్ అసోసియేషన్ సెక్రటరీగారిట్లు ప్రశంసించిరి:—

"మేము మీవొలోపెప్ బిళ్లలను ఉపయోగించినాము. వీనినుండి లాభములు గలవని ఘంటాపథముగా మీరు చెప్పునది నిజమని మాకు అనుభవమువలన తెలిసినది."

వొలోపెప్—నూటికి 25℅ పెట్రోల్ వ్యయము తగ్గించును.

వొలోపెప్—ఇంజనును భద్రపరచును.

వొలోపెప్—వాడుటచే ఇంజనుకు బలము హెచ్చును.

వొలోపెప్—వాడుటచే ఎంతటి సుకుమారమైన ఇంజనుకూడ చెడిపోదు.

ప్రతి గొప్పదుకాణములందును లభించును

65 బిళ్లలుగల టిన్ వెల రు 2 కల్దారులు

మనోహరమైన
తలవెండ్రుకలకొరకు

# KAMINIA OIL

అసమానమైనది — Re 1/- (రిజిష్టర్డు)

దానివెంబడి సూచనల ప్రకారము దీనినుపయోగించి మీ తలకట్టుయొక్క అభివృద్ధిని గమనింపుడు. కామినియా పట్టినానెవలెగాక, వెంద్రుకలకు ఆహారముగా పనిచేయును.

మూడు సీసాల ఖరీదు 2—10—0 పోస్టేజి ప్రత్యేకము.
అర్థణా పంపినయెడల ఉచిత సాంపిల్.

ఓటో దిల్ బహార్ (రిజిష్టర్డు)

హృద్యమైన సుగంధద్రవ్యము.

ఎల్లప్పుడు దీని నుపయోగించుటచే మీమనస్సు ఆనందముగాను, తాజాగాను యుండును. ఒకచుక్క మీపరిసరములను స్వర్గతుల్యముగాజేయును.

ఓ టో మే బ్లూం (రిజిష్టర్డు)

సుగంధ పుష్పములనుండి తయారుచేయబడిన అతిమనోహరమైన అత్తరు. పావు ఔన్సు సీసా 1—4—౦ ఒక డ్రాంబుడ్డి రు 0—12—0 వి.పి. చార్జివేరు. ఎట్టి ఉచితనమూనా కైనను 0—2—0 బిళ్ళలు పంపుడు.

ది ఆంగ్లోఇండియన్ డ్రగ్ కెమికల్ కంపెనీ బొంబాయి2

Sahara Prophylactic Brush

MADE IN ENGLAND — PURE BRISTLE — Price As.4

MILLIONS THRILLED BY MODERNIZED TOOTH BRUSH

# చార్‌మినార్ సిగరెట్లు

చార్‌మినార్‌సిగరెట్లు యిచ్చునదే దయగలహస్తము




ప్రఖ్యాతి వహించిన చార్‌మినార్ సిగరెట్ ఫ్యాక్టరీలో ప్రతి దినము తయారుచేయబడి మీ సిగరెట్టు దుకాణములకు పంపబడుచుండును.

బహు తాజా
మంచిరుచిగలవి
మంచిపొగాకుండును.

సిగరెట్లలో రాజు

వజీర్ సుల్తాన్ అండు సన్సు

"SABA &Co"

The only Leading National *Bi-weekly* of the Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA The only out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

*Volume 12* **Hyderabad-Dn.** **Monday 11 th April 1938** *Number 94*

# స్త్రీలను తన్నుట, కొట్టుట, తిట్టుట

## స్త్రీలపై పోలీసువారి అమానుష, అత్యాచార దౌర్జన్యములు

### నగ్నముగా స్త్రీలను పబ్లికు రోడ్లపై నీడ్చుట

### శాంతియుతమైన స్త్రీ సమూహముపై మోటారు లారీ నడుప ప్రయత్నించుట

## మాన్సా స్త్రీల దుస్థితి

అహమదాబాద ఏప్రిల్ (టప్పా)

ప్రజల ధనమాన ప్రాణముల కాపాడుటకు, శాంతి సంరక్షణముకు ప్రభుత్వమువారి వలన నియమింపబడిన రక్షకశాఖ—పోలీసు—వారు మాన్సా సంస్థానమునందు అమాయకులగు స్త్రీలపై దయా దాక్షిణ్యరహితముగా జరిపిన దౌర్జన్యముల, అత్యాచారముల, అమానుష కృత్యముల కనుగొనుటకు అఖిలభారత మహిళా మహాసభ అహమదాబాద శాఖనుండి ౧ ఏప్రిల్ రోజు వెడలిన మహాసభ సభ్యురాండ్రగు శ్రీమతి సోదరి శారదా మెహతా, సోదరి చంపా మెహతాగార లచ్చటి విషయము లిటులగలవని పత్రికా ప్రకటన ద్వారా దెలుపుచున్నారు:

ఒకరోజు పూర్వము పురుషు లరెస్టు చేయబడిన పంజపురమునకు ప్రథమముగ వెడలితిమి. ప్రభుత్వమువారి నిర్బంధ విధానమును పై అసమ్మతి ప్రకటించుటకు దేవాలయమునందొక మహాసభ జరుపబడెను. సుమారు ౧.౫౦౦ స్త్రీలుండిరి.

తీసుకపోయిరి. ఇంతేగాక స్త్రీలను అవరాని మాటలనిరి. బూతులు తిట్టిరి. ... ను కొట్టుటకై లాగి యీడ్చిరి. ... నగ్నముగానీడ్చిరి. ... తీవ్రమైన గాయము అనేకములు ...

## మత ప్రచారమునందు అధికారులు పాల్గొన నిషేధించుట

### హైకోర్టువారి స్టాండింగు ఆర్డరులప్రకారము నిజామాబాద విషయమును దివ్యంతొలూక్దారుగారిచే విచారింపబడుట

### భాయి పరమానందుగారిచే ఆరోపింపబడినవను "నాదర్షా నేరములు" నిరాధారములు

(ప్రభుత్వము వారి ప్రకటన)

హిందూపత్రికయందు భాయి పరమానందుగారి వ్యాసముపై మ. ఘ. వ. నిజాంప్రభుత్వపుదృష్టి ఆకర్షింపబడినది, దానియందు వారు ప్రభుత్వమువారు సంస్థానము, యితర ప్రాంతమ్ములందు యిస్లాంమతపరివర్తనముకై ధనమ్ము వెచ్చింపబడుచున్నటుల ఆరోపింపబడినది. మతప్రచారమునకు సంస్థానమునందు సంపూర్ణస్వాతంత్రము కలదు. వారే ప్రాంతమ్మయైనను అధికారులీవిషయమున పాల్గొనకుండునటుల ప్రభుత్వమువారి ఆజ్ఞలు గలవు సంస్థానమునందు హిందువులు గుర్రపుస్వారి చేయ వీలులేదనియు, ముస్లింలకుమాత్రమే యిట్టి సౌకర్యము గలదనియు, హిందువులకు ఆరాధనాస్వాతంత్ర్యము లేదనియు, హిందువులు ధవళవస్త్రములు ధరించవీలులేదనియు, వారు జజాయా—బొట్టుపన్ను—చెల్లించవలసియున్నదని భాయి పరమానందుగారి యునైటెడ్ ప్రెస్సు పత్రికా ప్రకటన మొదటి ౨౫ మార్చి తేదిన ప్రకటింపబడినది. అందరికి విదితమైనటుల యీ ఆరోపణలు నిరాధారములు, హాస్యాస్పదములు; మ. ఘ. వ. నిజాంప్రభుత్వమువారు తమ లక్షలకొలది హిందూప్రజలిట్టి అసత్యప్రకటనములు సత్యదూరములని రుజువుపరచుటకు వెనుదీయరని తలంచుచున్నది.

## మనవి

నగరమునం దేర్పడిన సంఘర్షణము వలన కార్యాలయమునం దనేకయిబ్బందులు తటస్థించినవి. ఈ పరిస్థితులచే ౪ పేజీలు మాత్రం ప్రకటింప గలిగితిమి. అనుకూలించు వరకిటులనే వార్తల నందజేయు చుందుము. చందాదారులు, ప్రకటనకర్తలు గమనింతురు గాక!

—వ్యవస్థాపకులు



Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy